తాపసులకడ జేసినట్లు బోధిసత్త్వునికడగూడ వినోదములు చేయ సాగెను. బోధిసత్త్వుడు చిటికె వేసి, "సుశిక్షితు లైన తాపసుల సన్నిధానమున నుండువారు సదాచారసంపన్నులు కావలెను, మనోవాక్కాయకర్మలతో సంయతులు కాదగును" అని యుపదేశ మిచ్చెను. మర్కట మానాటినుండి శీలవంతము ఆచారసంపన్నము నయ్యెను. బోధిసత్త్వు డన్యప్రదేశమునకు జనెను.

తాపసులు మరలి వచ్చిరి. మర్కటము పూర్వమువలె వినోదములు చూపలేదు. "ఆయుష్మన్, వెనుకటివలె చమత్కారము చేయ వేమి" అని అడుగువారై ఈగాథ పలికిరి:

ఆశ్రమమందు సదాచారు లైన
వారిచెంగట నిదివరలోన నీవు
గంతు లేయుచును మర్కటచేష్ట లెన్నొ
చేసెడివాడవు: శీలవంతుడుగ
నటియించుచున్నావు నచ్చదు మాకు

అది విని మర్కట మీగాథ పలికెను:

నేను బహుశ్రుతు డైన గోమాయు
పుత్రుండు చెప్పగా భూరి "విశుద్ధి"
విన్నాను' వెనుకటి విధమున నన్ను
తలపబోవకు, డింక ధ్యానవిహార
మొనరింప నుంటి ఆయుష్మంతులార!

విని తాపసులు ఈగాథ పలికిరి:

చట్టుపై బీజముల్ చల్లిన యెడల
మొలకలెత్తవు వర్షములవల్ల నైన
"పరమవిశుద్ధిని" బాగుగా విన్న,
వానరమ్మవు కాన ధ్యానింప లేవు

శాస్త ధర్మోపదేశము చేసి జాతకములు సరిపోల్చెను. ఆకాలమున క్రీడాప్రియు లైన తపస్వులు ఈతపస్వులే; గోమాయుపుత్రుడు నేనే.

# 300 వక జాతకము

శాస్త జేతవనమున విహారము చేయుచుండగా పురాణమైత్రిని గూర్చి చెప్పినది.

## వర్తమాన కథ

వర్తమానకథ సవిస్తరముగా వినయపిటకమున వచ్చియున్నది. ఇచ్చట అది సంక్షిప్తము. రెండువత్సరముల ఆయుష్మాన్ ఉపసేనుడు ఒక వర్షము ఈడుకల సబ్రహ్మచారితో కలిసి శాస్తసన్నిధికి జనెను. (ఉపసంపన్న భిక్షువువయస్సు ఉపసంపద లభించిననాటినుండి లెక్కింతురు.) శాస్తకు ఆలోచన కలిగినది. ఉపసేనుడు ప్రణామము చేసి వచ్చి, విపశ్యనా భావన అభ్యసించి అర్హత్వము పొందెను. అల్పేచ్ఛ మొదలగు గుణములతో కూడి నరల పదుమూడు ధుతంగధారణలు చేసి, తన అనుయాయులకుకూడ పదుమూడు ధారణలు కల్పించెను. మూడుమాసము లతడు భగవానుని ధ్యానించుచు, ఆవల అనుచరులతోగూడ శాస్తసేవార్థము చనెను. ప్రథమపర్యాయము అనుయాయు లుండుట వలన నిందితు డయ్యెను. ఈపర్యాయము ప్రశంస పొందెను. శాస్త అనుగ్రహించి నేటినుండి ధుతంగధారులు వీరైనపుడు నన్ను చూడవచ్చును అని ఆనతిచ్చెను. ఆతడు వెలుపలికి వచ్చి భిక్షువుల కీసమాచారము తెల్పెను. అప్పటినుండి భిక్షువులు ధుతంగధారులై శాస్తదర్శనార్థము చని, ఆయనధ్యానావస్థనుండి లేచినపిదప జీర్ణచీవరములను విడిచి తమచీవరములను ధరించి పోయెడివారు. శాస్త ఈవిషయము విని "భిక్షువులారా! ఈభిక్షువులవ్రతము బహుకాల ముండెడిదికాదు. ఈయది బకము చేయు, ఉపవాసవ్రతముతో సమానమైనది" అని పూర్వజన్మకథ చెప్పెను.

## అతీత కథ

పూర్వము వారాణసిలో బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండగా బోధిసత్త్వుడు దేవరాజు శక్రు డయ్యెను. వృక మొకనాడు గంగాతీరమున రాతిబండపై నివసించుచుండెను. గంగానదిలోని చల్లని నీరు పొంగి బండచుట్టును క్రమ్ముకొనెను. తోడేలు లేచి పాషాణముపై కెక్కెను. దాని కాహారము దొరకక లేదు. ఆహారార్థము పోవుటకు

మార్గము కనబడలేదు. నీరు పైకెక్కుచుండగా వృకము తనలో "నా కాహారము లేదు, పోవుటకు త్రోవలేదు. ఊరక పడియుండుట కంటె ఉపవాసము చేయుట మేలు" అని చింతించి, మనసా ఉపవాస వ్రతమును శీలములను పరిగ్రహించి పండుకొని యుండెను. అంతట శక్రుడు ఆలోచన కలిగి దాని దుర్బలవ్రతవిషయము గ్రహించి పొట్టేలు రూపముతో దానికి సమీపమున గానబడెను. తోడేలు దానిని జూచి రేపు వ్రతము పూనుదును అని భావించి దానిని పట్టుకొనుటకై లంఘించెను. పొట్టే లిటు నటు గంతులు వేయుచు తనను పట్టుకొన నీయలేదు. దానిని పట్టుకొన జాలక తోడేలు మరలివచ్చి, పండుకొని వ్రతభంగము కాలే దనుకొనెను. శక్రుడు నిజస్వరూపుతో ఆకసమున నిలిచి "నీవంటి దుర్బలచిత్తులకు ఉపవాసవ్రత మేల? నేను శక్రుడ నను విషయము గ్రహింపక నీవు పొట్టేలుమాంసముతో పొట్టనింపు కొన దలచితివి" అని దానిని మందలించి, నిందించి దేవలోకమునకు బోయెను.

ఈ మూడును అభిసంబుద్ధుని గాథలు

అన్యజంతుప్రాణహరణమ్ము కావించి
రక్తమాంసంబులం ద్రాగి మ్రింగెడి వృకము
ఒకసారి వ్రత మూనె నుపవాస మొనరింప.

వ్రతదుర్బలత్వంబు గ్రహియించి శక్రుండు
అజరూపము దాల్చి అరుదెంచె నచ్చటికి.
తద్రక్తపాయికిం దపము భంగం బయ్యె;
తోడే లజముపైకి దుమికెన్ వ్రతమును మాని.

లోకమ్ములో జనుల్ లేక దృఢనిశ్చయము
చంచలత్వము వృకముచందాన పొందుదురు.

శాస్త్ర ధర్మోపదేశమును చేసి జాతకములు సరిపోల్చెను. ఆకా

ద్వితీయ సంపుటి